8 స్యైతన్నిర్మలత్వం జగతి విజయతే దర్శయన్నా
నమిన్దుః॥ వంశే తస్యాన్నరేశ్వరాః సమభవన్తేషాం గుణాళ్ప
న్దళః పోత్ఫుల్లాఇ-

9 వయాత్ పురాణకథ గాస్త్రత్రాపినోసమ్మతాః తత్ర
తాః వ్యవధం శ్రితాస్త్రిభువనేమూర్త్తిన్దధానా ఇవ భ్రా

10 మ్యన్త్ వస చేతనాఃశ్రుతిగృహే విశ్రమ్య చ॥
చరిత్యేకం శశివంశ భూపతి భుజవ్యాపారసంకీ

11 ర్త్తనం కత్తున్ న్బ్రః క్షమతేక్షితౌ బహుముఖో
యత్త్రిజనస్యైవహిదోర్ద్దణ్డార్జితకీర్త్తిపర్ణనపరం తద్భా

12 రతం ప్రాభవత్తస్యాద్యాన్వయ మాత్రమాదిస్య
వతశ్శ్రీకేక్రమల్లిఖ్యతే॥ తథాహి చన్ద్రాద్బుధః । బుధా

13 దనలః అనలాత్ పురూరవాః పురూరవసో వా
యుః । వాయోర్న్నహుషః । నహుషాద్యయాతిః తతస్తు
వ్యసుః । తతో గార్గ్యే

14 యః । తతో విరోచనః । తతః సామ్యేద్యః ।
తతో భాస్వాన్ । తతో దత్తసేనః । తతః సామ్యః । తతో
శ్వదత్తః తతః సో

15 రాంగ్గః । తస్మాద్బ్రిత్రాంగ్గదః । తతః శీతధ్వజః।
తతో ధర్మ్మేక్షీ । తతః పరీక్షిత్ । తతో జయసేనః।తతో
విజయసేనః

16 తతో ప్రిథుధ్వజః తతః ప్రగల్భః తతః శక్తిః ।
తతః కోలాహలః । స ఏవానస్తవర్మా భవత్ । ధనకనకసమృ
ద్ధో గఙ్గ

17 వాడిప్రసిద్ధః సకలవిషయభూతః స్వర్గ్గివర్గ్గో
పభోగ్యః తదధిపతిరథానేకాన్యనన్తవమ్మా నృపేన్ద్రః సమ
భవదితి

18 రూపగఙ్గవామ్నాతవాద్యః । కోలాహలః సమ
రమూర్ద్ధ్ని తతోన్నృపాణాం భూతో యతః సరపురఞ్చతదీ
యమత్రి కోలాహలాఖ్యాయ

19 మభూత్ పురసద్మతుల్యం తస్మిన్క్రమేన్నృపతి
ర్భిబ్బర్హుభిద్బభూవే । రాజ్యశ్రీ ధృతి నారసింహనృపతౌ
జ్యేష్ఠే మహాస్తే హదో

20 ర్ద్దణ్డాఙ్కిత భూతలోద్ధితరమాకర్ణాగ్రహే నన్దివః
ఇఞ్చన్నాకమియంభుజాసిలతి కాసంచేష్ట్యతాంతాం వైరిణాం
కర్ణారణ్యా

రెండవ రేకు; మొదటి పేట.

1 మియఞ్చకీర్త్తిలతికా (ద్యాన్నః సహారోహతు॥
భ్రామ్యద్భిర్వ్రజిగీషయాక్షితితలే క్వాపిద్విషన్నిత్తైః
క్వాపిద్విషి)

2 కులప్రమాధిభిరపి ప్రాప్తాః కలిఙ్గా కిల । తైః కా
మార్ణవపఞ్చమైన్నృపవరైఘూర్జద్వలిఙ్గసమం ప్రాప్తన్ది
ష్టమివార్ణవా

3 దుపగమత్ కూర్మ్మావతారోహరిః కూర్మ్మస్వామినిసాక్షి
ణిత్రినయనే తస్మిన్ మహేన్ద్రాగతే గోకర్ణేశమహోదధౌ

4 యతిపాసూర్య్యేతథేన్ద్రావపి కాలిఙ్గాభ్యుదమా
హరత్ భుజబలాపనోపభుక్తాం చిరం లక్ష్మీమ్మత్యఘకాస్తుతి
వదవతతో గఙ్గా

5 న్వయపాఖ్యాతే తత్రాసీద్వంశకర్త్తాసౌ కామార్ణ
వమహీపతిః యస్యేతి పుత్త్రపౌత్రాద్యారాజానః ఖ్యాత
విక్రమాః శాస్త్రి)

6 ర్ద్ద నిష్ఠితతమాత్వేషు పన్మరాశి సవ్యార్థవ
ర్గ్గపరితోషణ హేతువర్గ్గః ఆచారతోపి మానిపుఙ్గవ
మార్గచారీత

7 స్మాదభూన్నృపవరోభువి వజ్రహస్తః నవాము
తః కేవలమర్ణతోపి స వజ్రహస్తస్త్రి కలిఙ్గనాథః
కోవజ్ర [సాస్త్రా]

8 దపరఃపృథివ్యామ్యవజ్రన్నృప ద్వారయితుం సమ
ర్థః వ్యాప్తిగ్గఙ్గసుతోత్తమన్యయశసా దిక్చక్రవాలే శశి
[ప్రాయేణా]

9 మలినేనయస్య భువన ప్రహ్లాద సమ్పాదివా సిన్దూ
రైరతి సాన్ద్రపఙ్కపటలైః కుమ్భస్థలీ పట్ట

10 కే స్మాలి ప్రస్తి శ్రుతః ఫునశ్చ హరతా మాధోరణా
వారణాన్ మహిషినజ్ఞమాతస్య పావ్వ॥

11 తీక్షపినాకినః తస్మాత్తస్యామ భూద్వీరో రాజరా
జో మహీపతిః సరాజరాజోద్విజ

12 రాజకాన్తి భుజఙ్గరాజా నసవత్ప్రకీర్త్తిః
శ్రీమత్తయాధః కృతరాజరాజః సువిక్రమ వ్యక్రమ

13 త దేవ [రాజః] తస్యాగ్రమహిషీరాజ్ఞో నా
మ్నాభూద్రాజసున్దరీ లక్ష్మీనారాయణస్యైవ చన్ద్రస్యే
వతు రోహిణీ తతస్తస్యా

14 ధేయజడతః కాలేకలిః క్రూయతే యత్కీర్తి
దుగ్ధజలనిధి భువనాన్తరాలం సంప్లావ్యమూరతరముచ్ఛలి
తః సభాతి

15 తారాగణాః స్ఫుటరుచోగగనే సమస్తాత్ సూ
క్ష్మాతిసూక్ష్మతరలా ఇవవిస్ఫురన్తి త్యాగశౌర్యైక చ స
త్యైకచకణాః

16 జ్ఞానయుధిష్ఠిరైః సద్భశోయామహవీశో రాజ
రాజో నరోధిపః రాజరాజోనరపతి దశసప్తచ

17 వత్సరాన్ భువిరాజ్యశ్రియం భుక్త్వాస్వారా
జ్యాయప్రతస్థివాన్ చాలుక్యకుల సమ్భూతా వేలా సౌన్ద
ర్య వారిధేః నామ్నా

18 మజ్జ్వాణదేవీతి మహిషీతస్యభూపతేః తస్యా
మభూదద్భుత విక్రమశ్రీః శ్రీమానసౌ భూభృదనఙ్గ
భీమః వీరా

19 జతే కీర్త్తినుధాతరఙ్గై ధౌతాసుదిగ్భిత్తిషు
యత్రశస్తిః యస్యానగణలదోర్విణలాసలహరీలావణ్యవైరి

20 వ్రిజ క్రిన్దత్ పౌరవధూవిలోచనచయః పూ
ర్ణైకధరా చన్ద్ర రాకీర్చ్చిత్త్వాగతరఙ్గభఙ్గికలశైపాథో

నాల్గవ రేకు; రెండవ ప్రక్క.

1 ధిపూనోత్సవా ద్విశ్రిదావక్రిత కన్దరః సభగవా
న్మత్స్యపురాణో మునిః కస్త్మోభిః కవిరిత్రికన్యావి

2 మనాః కస్మైత్రివివేద్యాత్మనః కోశామ్భ్యస్థ మహా
హాఽమి కలయా కిన్వేత్రినామాన్యా రా ముక్త్వాపంకల

3 యాస్మదీయ సమయోత్తేపాయగర్గాన్వయే జా
తః శ్రీమదనఙ్గభీమనృపతిః సోఽర్ధభూమోమమన్యానా

4 సు బద్ధ నిబిడప్రసరప్రమోదం। మాధ్వీకముగ్ధమ
సృణం హృదయారవిన్దం దేవః పురాణపురుషః పరరత్య

5 యస్య రోలమ్బడమ్బరకలాం కలయామ్బకారః॥
లక్ష్మీరక్షణసావిదల్లపదవీం ప్రత్యర్థి పృథ్వీభుజాం ప్రాణాక

6 షణరజ్జువిభ్రమతులా ముద్రామనూనస్య యాణస
సఙ్గ్రామస్థలకేలికాణ్డవకలాపాణ్డిత్య మామణ్డయాయస్యా

7 యజ్ఞాగదద్భుతైక విలసత్ క్రీడానటః సాయ
కః యస్యావగణల విక్రమార్జితయశః క్షీరోదదానోర్మి

8 భి దాశారంకిలకామగో పరిభృతయాః ప్రో
త్సారితో దూరతః కించావరహిరణ్యగర్భకలనా వైదగ్ధ్య

9 మాకర్ణయణ లజ్జాలోల చతుస్త్రభాక్షియుగ
లోమన్యేమహాన్పత్రభూః యోనాని

10 ష్వేకసముయః కలితేత్రియేణ నీతస్తులా పురుష
దానకలాను బన్ధిః లబ్ధాపి

11 వక్షితిర ముష్యముదే తధాభూత్ యాదృగ్వి
జాతి జనశాసన దానకేలిః అక

12 ర్షతా హృదయమేణ విలోచనానా మాధుర్య
తాచ పరితః పరిపాన్ధివానాం

13 అర్ధాన్వితప్రణయినా కృతినామనఙ్గ భీమప్రసి
ద్ధిగమునా వివధే నృపేణ జగామధామ దేవానాంస

14 ప్రేవః సేవకప్రియః భుక్త్వాభుజప్రతాపేన
చతుస్త్రింశత్ సమాః క్షమాం శ్రీకస్తూరీదేవ్యాముద

15 తౌతస్మాచ్చకళ్యసామూర్త్యం జగదుద్ధరణం
పాతకహాన్తాపి నరసింహ అసురేన్ద్రశోణిత

16 నివేశవిశ్రా పనినీషయేషు బహుదానవ భిః
కరమాత్మనస్తముషునా విశోధయ న్నరసింహ ఏషజ

17 గతిస్ఫుటోభవత్ శ్వేతాతపత్రేస్థిత తామర
చారుమూర్తిః దిగ్దన్తిదణ్డపరిమణ్డలమణ్డితస్య అ

18 శేషకృతస్య నుత భావన యాభవాన్యా సిం
హానసే జగతియస్య వదన్నదైవ రాధావరేంప్రియయ

నినాయనాం

19 జవాత్రిశు పూరేణమూర విని వేశిత కాలిమశ్రీః
తద్విపరిలమ్భకరణాద్భుతనిన్యగర్గా గర్గాపినూనమమునా

20 యమునాధునా భూత్ భుజభవగిరి యోష్ఠాయ
స్య భూవిన్ద్రిభతుణః క్షితి భరణ సమర్ధాం కీర్చ
దిమర్కైకే న్ద్రాం

ఐదవ రేకు; మొదటిప్రక్క.

1 అతులయదిహాసన్వచ్ఛేత్ తులాపురుషేణ క్ష్వ
భనతుకనకాద్రి దేవతానాం గృహోభూత్ కువ్యపక్రా

2 శమదిశం ద్విజసాచ్ఛకృత్వా మేరుం తులా
పురుష మాఖ్యమనోర్ధదానైః స్థాతూసురైః సహ మ
హాత్కల దాన్తికో

3 దానా కోణేకుటీరక మచీకర దూషరశ్మేః అష్టా
శాం చక్రవాల భ్రమణరణ మహాయాననమ్భాలితక్షుత్ ణా

4 రేక్షూదవ్యదస్యోపగమితమపి లంఘయిత్వా సురాద్ధిం
నపిణంసన్నుణదాయుదధిమధురమధుస్వాద్య (దు) ద్వే.

5 వత్సృష్ట్వా యతీకృతిః కాన్తమూర్తిః శలిలనిధి మధ్యా కామసారా సతీవ కృత్వా నిమ్మకంధితద్విషద్వసు

6 మతిమబ్దాన్త్రయస్త్రింశతం భుక్త్వా భోగమను త్తమం నరపతిదోర్గర్వః సర్వజ్ఞః స్నేహత్యన్త వినాకృ

7 తోన్తిమదశా మాసాద్య దీపోపమః ప్రాప్తః కాలపతఙ్గపుఙ్గవశం యాతస్సనిర్వాణతాం తస్య

8 శ్రీమాన్ సూదినవిధయే మాలాచన్ద్రాత్ర జా యాం సీతాదేవ్యామజని తనుజో భానుదేవః

9 పద్మోల్లాసమ్విదధత్కులం కైరవగ్లానిముచ్చైచ్చర్వన్ వ్యాతిధ్వంసి పరధరణిభృన్మౌలిని

10 న్యస్తపాదః ప్రిత్యుజ్జీవనకారణైర్జన పద స్యాభ్యస్తనీత్యాగమైద్వర్ణ ష్టాదుష్ట

11 ఫల్గుదేవవిధినా నిత్యం నిరస్తారిభిః ప్రాప్తైః షోడశభిర్ణ శుద్ధ చరి

12 తా మోఘ ప్రతిష్ఠైరయం సామ్రాజ్యమహీ భృల్లక్ష్మీపతే రాజ్ఞయా త

13 స్ధమష్టిరపి నిర్భరదాతా వేపనోపి సమరైక ధురీణః ఉగ్రమూర్తిరపి కృష్ణశరీరో యాత్కృ రేణ క

14 రితః కరవాలః పాయాపాయం మావిరవిరతం ప్రస్తుతేయస్యయజ్ఞేజాతే జీర్ణహారిరతితరాం యా

15 తి ః దారిన్సముద్రే ధూమోద్గారీ లవణసలిలం ప్రాప్నుతే బాడవాగ్నిః ప్రౌఢ్యచ్ఛాలః సమజని

16 శివః కాలకూటాశనోపి బ్రూమః కిమన్య త్కుల నాం లఘుతోపనీతస్తత్త్వరక్షతి భృతః కిలదానశౌర్యం

17 సభ్యోపదేశ కనకాచల కామధేను కల్పద్రుమా నదితనిర్జిత సన్ప్రవస్తాన్ చన్ద్రార్కపుల్లోపభోగను

18 లభ్యోత్యుచ్చ సౌధావలీ శోభావిస్ఫురితానిశా ననశతాన్యేకః క్షమాధీశ్వరః స్వచ్ఛాయనిరపాల

19 పూగకవల ప్రాయైస్తరూణాఙ్గణైః కృత్వా తా మ్రవిలేఖితాని విధివత్ సచ్ఛోత్రియేభ్యోదదా చిన్తామణౌ

20 సరమహీరుహ కామధేనా వష్టాదశాబ్జమథితి ష్టతి భానుదేవేజ్యాయానమిహభవితా కతమోమ మేతి దాతు

ఐదవ రేకు; రెండవ ప్రక్క.

1 విచారవశగో నృపతిబభూవ చాళుక్యకుల సంభూతా శ్రీమజ్జాకల్లదేవికాలక్ష్మీస్నారాయణస్యేవభాను

2 దేవస్య తాదృశీ యస్యాః సూనురభూద్వీరః శ్రీ నృసింహమహీపతిః గంగవంశ సముద్ధర్తా హర్తా వైరిమ

3 హీతలా యథాజ్ఞాసస్త ధాశస్త్రైశాస్త్రైవాచ స్వతియాదా దానేకద్గోబలే భీమాసౌన్దర్యేమసుమాయు

4 ధః తేనదత్తం ద్విజాతిభ్యః శాసనం శతసంఖ్య కం మహాదానానిదానాని శ్రీమన్మాతురనుజ్ఞయా

5 వీరశ్రీనృసింహదేవ నృపతౌ సింహాసనాధిష్ఠితే భూమిపాలకిరీటకోటి కిరణ ప్రద్యోతి తాంఘ్రిప్రియే

6 ప్రత్యర్థిక్షితిపాలిదీర్ణహృదయా భీత్యాప్రహే ణశ్రియః ప్రాణత్రాణపరాయణాః సమభవన్ పృథ్వీధరావా

7 సినః యస్మిన్ ప్రశాసతి భువః కులభూధరేన్ద్రాః కూర్మోభుజంగమపతి ద్విరదానేకపాన్ప్రభూభారగౌరవ

8 కృతాతి శిరోవికారా విశ్రాన్తిలాభమభజన్త కృతాశిషశ్చ వీరాసనం సమధి తిష్ఠతికుఞ్జరాణా

9 మ్ప్రరోదహేస్ద్రిణ ధురం భువికోత్రనామ ఇ న్ద్రాయుధ ప్రభభుజద్వయ సద్వితీయే కమ్పిన్తనో

10 తి కరవాలలతాపి యత్ర యశఃఖడ్గ వణ్ణచణ్ణమహా సారపురాజతానా దావ్యాత్య సమ్పదమమ

11 త్యర్థరోః సమానాం భూదేవపాదకృత భూత లభూమకేన దానామ్బుసాద్రితల సత్కర

12 పల్లవేన తస్యాథక్షితి పాలయాలివడ భీవిన్యస్త పాదాంభుజ స్యామోహాస్త కి ముచ్య

13 తేద్యమహీమాకీర్తిర్నృపశ్రీభృతః యస్త్రి తిం కిలకిన్నరీ గణముఖాద్దిగన్తాంతృణ్వతాం కోలమ్బ

14 మదమాపిబన్తినిది భృతంనిః కర్ణామాలేనుఖేయ స్యేష్టానసృషత్రతస్యవిజయావన్యః ప్రతాపః పరంనచ్ఛాలా

15 క్రియమాణతప్తరసన ప్రఖ్యాః కులక్ష్మాభృతః స్త్వా పాశముపాశ్రయన్తి చయతచత్వార ఏవాబ్దయాది

16 గ్యాప్తిమ్బజతే యతోఖరమణిస్నాకధః సహ స్రత్విషామ స్వస్తి సప్తదశోత్తర ద్వాదశశత శకవత్సరే

17 చతుర్దశభువనాధి పత్యాది బిరుదావలీ విరా జమానః శ్రీవీరవరసింహ దేవమహీపతిః స్వరాజ్యసేక

18 వింశత్యఙ్కేభిలఖ్యమానే సింహశుక్లషష్ట్యాం సోమవారే రేముణాకటకే నవరామ్యన్తరవిజయసముయేపారీ

19 ముదశేవగఙ్గాతీరావవధారితన్యాయాత్ సోమగ్రహణ సమయనమూత్ సృష్టాసేక భూమధ్యాత్ కాశ్యపసగోత్రాయ

ఆరవ రేకు; మొదటి పెడ.

1 శాక్యవాహశకాబ్దర నైధృవప్రవరాయ యజుర్వేద దాన్తర్గత కాణ్వశాఖాధ్యాయినే కుమారమహాపాత్ర భీమ దేవశర్మణే భూమి

2 పఞ్చాశద్వాటికా పరిదానాయ డేరా విషయ మధ్యాసీనం ఏడరగ్రామం పురో శ్రీకరణశివదాసనామక నలపరిమాణేన ఉత్తరతః

3 మాళోపురార్ధ సీమ దణ్డార్ధమ్యధమీకృత్య తలజగ్రామీయుపాణేధ ముఖాయదణ్డార్ధదక్షిణావచ్ఛేదపశ్చి మతః సాహస

4 మల్లీయుపుష్కరిణీపశ్చిమ హీడమాదీకృత్యాలి మూతిపడాగ్రామార్ధ సీమహేడావచ్ఛిన్నపూర్వసీమాన మేవదతుః సీమావచ్ఛిన్న

5 ద్వాదశగుణ్ఠోపేతషోడశమానాధిక ద్వా చత్వారి ఙ్ద్వాటికా మధ్యాత్ పురాతనదేవబ్రాహ్మణభోగ్యగో హారి గోపథదణ్డా పుష్క

6 రిణీసమేతనవమానాధికాము బహిష్కృత్య నిరర్ధకర ద్వాదశ గుణ్ఠోపేతసప్త మానాధికచతుస్త్రింశద్వాటికాప రిమితం॥ తథాస్య

7 ఙ్గవిషయమధ్యాసీనం సునాఇలో గ్రామత స్యాపి నలపరిమాణేన । పశ్చిమతః । భీమనారాయణపురడిసీమద ణ్డార్ధమాదీకృత్య ।

8 ఖణ్డసాహిగ్రామార్ధ సీమదణ్డార్ధ వచ్ఛిన్నపూర్వ మర్యాద । దక్షిణతః వేసపడా గ్రామార్ధ సీమదణ్డార్ధ మారభ్యఘూడాపాలగ్రామార్ధసీమ

9 దణ్డార్ధోత్తరావచ్ఛేద మేవంచతుఃసీమా వచ్ఛి న్నషడ్గుణ్ఠోపేత త్రయోదశమానాధిక త్రయస్త్రింశద్వా టికా మధ్యాత్ పురాతన దేవబ్రాహ్మ

10 ణభోగ్య గోహారి గోపథ పుష్కరిణీ సమేత ద్వాదశాధిక దీర్ఘవాటికా బహిష్కృత్య షడ్గుణ్ఠోపేతమా

11 నేకాదశాధికత్రయో వింశతివాటికా మధ్యేవిశ లీకృతాష్టాదశమానోపేతాష్టమాధికసప్తవాటి

12 కామార్కచన్ద్రదాసకారణన్యనల ప్రమాణేన ఏతదీయసీమాయా పశ్చిమతఃకఇలోగ్రామార్ధసీమదణ్డాస్థ

13 వటవృక్షమారభ్యనా ఇలోగ్రామమధ్య క్షేత్రి వటవృక్షావీథిపూర్వసీమానం ॥ఉత్తరతఃసునాఇలోగ్రామమ

14 ధ్యక్షేత్రస్థవట వృక్షమాదీకృత్యవేడా పడాగ్రామా ర్ధసీమదణ్డాస్థవటవృక్ష వచ్ఛిన్నదక్షిణమర్యాదంఏవంచ॥

15 తుః సీమావచ్ఛిన్న భూఖణ్డా అష్టాదశమానో పేతాష్టమానోధిక సప్తవాటికామితం బహిష్కృత్య నిరవక రత్రయోదశ గుణ్ఠాధిక ద్వాదశమా

16 నోపేత పంచదశ వాటికాపరిమితం సజలస్థల మచ్ఛిద్రప

17 సహితమాచన్ద్రార్కం మకరీకృత్య ప్రాదాత్ అ స్మిన్ గఙ్గానరసింహ పురశాసనే పూతిమాషగోత్రాయ ఋగ్వేదాన్తర్గతశా

18 కలశాఖాధ్యాయినే శేషాయశ్యల్లాలనాధశర్మణే శాసనాధికార వ్యవస్థితావాటికైకా తామ్రికరా యన్నాడినామ్నే

19 వాటికార్ధంచ॥ అస్యశాసనశాఙ్గతయా। సాక్షి ణరఘూడఖణ్డమధ్యతు చడాగ్రామీయకోమటి మాజ్య శ్రేష్ఠికపుత్రి

20 పురాణశ్రేష్ఠిసుతే నోరి శ్రేష్ఠి నామా॥ కణ్టపడి పాట్టేయ తామ్రలిక మహాదేవ వేలాలికస్యనప్తాధిత్తు వేలా

21 లినామా ప్రసోత్కపురహట్టీయ ఊస్థలీతామ్రి కార అమ్మాఇ॥ వేదపురఊస్థలీకస్యకారమదాఇనామా॥

ఆరవ రేకు; రెండవ పెడ.

1 మద్దానఫల సిద్ధ్యర్ధం తద్రక్షాఫల సిద్ధయే మద్ధ ర్మః పరపాల్యోయం భూపైరా చన్ద్రతారకం మాభూద ఫలశంకావః పరదత్తేతి

2 పార్ధివ స్వదత్తాదధికం పుణ్యం పరదత్తాను పాలనం స్వదత్తాత్పరదత్తాన్యా యత్నాద్రక్ష యుధిష్ఠిర మహీమ్మహిమతాం శ్రేష్ఠః దానాత్ శ్రేయోను

3 పాలనం స్వదత్తాం పరదత్తాంవా యోహరేత వ సున్ధరాం సవిష్ఠాయాం కృమిభూత్వా పితృభిః సహపచ్య తే॥ విన్ధ్యాటవీ ష్వతోయాసు శుష్కకోటరవాసినః కృష్ణసర్పాహిజాయన్తే దేవదాయాపహారిణః — [*sic; printed:* తే॥ నిజలే పాన్తశదేశేషు]

4 కోటరవాసినః కృష్ణసర్పాహిజాయన్తే యేహరన్తి వసున్ధరాం గామేకం స్వర్ణమేకంవా భూమేరప్యర్ధమ ఙ్గులాహరన్నరకమాప్నో

5 తియావదాభూతి సంప్లవం శక్తునాపి కృతోధ ర్మ్మం పాలనీయో మనీషిభిః శత్రురేవహి శత్రుస్స్యాత్ ధ ర్మ్మః శత్రునకస్యచిత్ మ

6 ద్వంశజాః పరమహీపతి వంశజాతా పాపాద పేతమనసో భువి భావి భూపాః యేపాలయన్తి నుమధ మ్మఘ మిదంసమస్తం తే షామ్మయావిరచితో౽ఞ్జలిరేషమూర్ధ్ని॥

---

## సంక్షిప్తార్థము.

---

ఈశాసనము నందు చోడగంగునివంశము వర్ణింపబడి యున్నది. శాసనరూపమున చోడగంగుని వంశక్రమము వర్ణింపబడినదగుటచే, యీశాసనము ప్రాముఖ్యత వహించినది. గంగవంశానుక్రమము వర్ణించుశాసనములు పెక్కులులేవు. శాసనకర్త రెండవ నరసింహదేవుడు. శాసనము రసవంతమగు కవిత్వముచే నొప్పియున్నను అనుశ్రుతములగు గాథలతో ప్రారంభింపబడియున్నది. ఆభాగమును వదలిపెట్టి, చారిత్రక విషయమగు వంశక్రమమును యెత్తి వ్రాయుచున్నాను. మొట్టమొదట విష్ణువుతో వర్ణన మారంభింపబడి యున్నది. ముఖ్యముగా మనకు తెలియువది, గాంగులు చంద్రవంశీయులను విషయము. ఆవంశమందు కోలాహలుడను రాజు జనించెను. [మొదటిరేకు, రెండవ ప్రక్క, 16 వ పంక్తి] అతనికి యనన్తవర్మయని నామాంతరము. యుద్ధములందు శత్రువుల జయించి, కోలాహల పురమును స్థాపించెను. గంగవాడి యనునది యాతని స్థానము. వంశక్రమమున కామార్ణవుడను రాజు జనించి, తన భుజబలముచేత కళింగరాజ్యము జయించి, యచ్చట గంగవంశము స్థాపించి, వంశకర్త యయ్యెను. పుత్రపౌత్రక్రమమున నాతని వంశమువారు కళింగమును పాలించిరి. కొంతకాలమున కావంశమున వజ్రహస్తుడు జనించెను. [కామార్ణవునకును వజ్రహస్తునకును మధ్యనున్న రాజులను శాసనము పేర్కొనియుండలేదు.] ఆతడు శాస్త్రార్థమునననుసరించి శత్రువులను జయించి, బీదలను రక్షించి, మానిపుంగవుల యాచారములను గమనించెను. ఆతనిభార్య నంగమ. వారిరువురకును పుత్రుడు రాజరాజు. అతని భార్య రాజసుందరి. వారిరువురకును కీర్తి గాంచిన చోడగంగు డుద్భవించెను. ఆతడు గంగా గౌతమీ మధ్యదేశమును భుజబలముచే నార్జించినవాడు. ఆతని శౌర్యమును, ప్రతాపమును శాసనమందు విశేషముగా వర్ణింపబడినవి. ఆతడు పురుషోత్తమునకు నాలయము ప్రతిష్ఠించినట్లు శాసనము తెలుపుచున్నది. ఆతని భార్య పేరు కస్తూరికామోదిని. వారి పుత్రుడు కామార్ణవుడు. ఈతడు శక సంవత్సరము 1064 లో పట్టాభిషిక్తుడయ్యెను. తరువాత 10 సంవత్సరములు విశేషశౌర్యముతో రాజ్యమును పరిపాలించెను. ఈతని వెనుక చోడగంగునకు మఱియొకభార్యయగు నిందిర వలన కలిగిన రాఘవుడు రాజ్యము పాలించెను ఈతని ప్రతాపము, రెండవ రేకు రెండవప్రక్క 18 వ పంక్తి మొదలు, మూడవరేకు మొదటిప్రక్క 7 వ పంక్తి వరకు వర్ణింపబడినది. ఈతడు 15 సంవత్సరములు రాజ్యము చేసెను. తరువాత చోడగంగునకును, చన్ద్రలేఖయను భార్యకును, జనించిన రాజరాజు కళింగమును 25 సంవత్సరములు పాలించెను. ఈతని యనుజుడగు యనియంకభీముడను రాజు తరువాత రాజ్యమునకు వచ్చెను. ఈతడు 10 సంవత్సరములు రాజ్యముచేసిన తరువాత యాతనికినియాతనిభార్యయగు బాఘల్లదేవికిని జనించిన రాజరాజు పట్టాభిషిక్తుడయ్యెను. ఈతని రాజ్యకాలము 17 సంవత్సరములు. రాజరాజు చాళుక్యవంశ కన్యయగు మంకుణయను నామెను వివాహము చేసికొని యనంగభీముడను పుత్రుని గాంచెను. ఈతడు తులాపురుష వ్రతాదుల నాచరించి యతిప్రగల్భుడై, 34 సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతనికి కస్తూరిదేవి వలన వీరనృసింహుడను రాజు జనించెను. మిక్కిలి శౌర్యశాలి. రాఢా, వరేంద్ర రాజ్యముల నతిప్రతాపముచే జయించినవాడు. గంగానదివరకు రాజ్యముల నాక్రమించెను. 38 సంవత్సరములు కళింగమును కీర్తితో పాలించెను. ఈతనిభార్య సీత కుమారుడు భానుదేవుడు రాజై, యనేక దానములను బ్రాహ్మణులకును, తదితరులకును, చేసెను. ఈతని భార్య చాళుక్యకుల సంభూతయగు జాకల్లదేవి. శాసనకర్త యగు నరసింహదేవుడు వీరలకు పుత్రుడు. ఈతని ప్రశస్తి శాసనమున నెక్కువగా చేయబడియున్నది. ఈతడు 1217 శక సంవత్సర సింహశుక్లషష్టిదినమున సోమవారమున, తనయంక సంవత్సరము 21వ సంవత్సరమున, రేముణా కటకమున శాసనము చేసెను.

---

## 20 అనంతవర తామ్రశాసనము.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు.

ఈశాసనపు రాగిరేకు లిప్పుడు గానరావు. సర్వేయర్ జనరల్ మెకంజీదొరగారి యొద్ద నుద్యోగిగానున్న 'మల్లయ్య' క్రీ 1811 సం. డిసెంబరు 16 వ తేదిని రాగిరేకులను జూచి మూలమాప్రతి వ్రాసికొనివచ్చినాఁడు. ఆప్రతి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది. దానినిబట్టి నేనీశాసనమును బ్రకటించుచున్నాఁడను. అనంతవరములో నేఁడా రాగిరేకులు దొరకునేమో యని యక్కడివారి నడిగితిని గాని యెవ్వరును నున్నట్టు చెప్పలేదు. అప్పుడున్న యా రేకు లీనూటపదునేడేండ్లలో నెప్పుడో యెందుక్రిందనో మాఱియుండవచ్చును.

### శాసన గౌరవము

రెడ్డిరాజుల తర్వాత నోడ్డరాజులు తెలుగుదేశమును గొంతకాలము పరిపాలించిరి. కాని నేనెఱిఁగినంతలో నేఁడు చరిత్రములు వ్రాసి ప్రకటించిన వారాయోడ్డరాజుల పరిపాలనమును గూర్చి విపులముగా పరిశోధనము జరపలేదు. వారి శాసనములు గూడ నెక్కువగా దొరకలేదు. కీర్తిశేషులయిన బుక్కపట్టణపు రాఘవాచార్యులు గారు మాత్రము కొంచెముగా దమ యాంధ్రదేశ చరిత్రలో [ఈ గ్రంథ మముద్రితము] వీరిని గూర్చి చర్చించిరి. శ్రీకృష్ణదేవరాయలవారిచే బరాజితుఁడై తనకుమార్తె నారాజేంద్రున కర్పించి శరణాగతుఁడయినవాఁడు, తెలుగుదేశమును బాలించిన యోడ్డరాజులలోఁ గడపటివాఁడు నగు ప్రతాపరుద్రగజపతిది యీశాసనము. ఈరాజుశాసనము లింతవరకు రెండుమూడు మాత్రమే దొరకెను. అందు విశేషవిషయము లంతగాలేవు. అవియును ముద్రితములు గాలేదు. ఈశాసన మన్నింటికంటె గొప్పది. అపూర్వవిషయములు గలది. కాన దీనిఁ బ్రకటించుచున్నాఁడను. అపూర్వవిషయము లేవో యిఁకఁ దెలియగలవు.

### అర్థసంగ్రహము

వరాహహేరంబసింహాద్రినృసింహులు మువ్వురు మూడుశ్లోకములలో స్తుతింపఁబడిరి. 4. సూర్యప్రశంస. 5. ఆ [సూర్యుని]వంశమునఁ బరాక్రమశాలియైనవాఁడు కపిలేశ్వరుఁడనురాజు జన్మించెను 6. ఎప్పుడును దానము లొసఁగుచుండు నీగజపతిని లోకులు సింహాసనావస్థులగు మూఁగురు రాజులలోఁ బుణ్యవదగ్రగణ్యుఁడని పేర్కొనుచుందురు. 7 ఈతఁడు అనేకాగ్రహారముల నొసఁగెను. 8 ఈతఁడు బలాత్కరించి కర్ణాటరాజధానియైన విద్యానగరిని తనసేనలతో వరికట్టి సమున్నతమయిన మానమునుబోలె హెచ్చుపన్నుఁ గైకొనెను. 9 ఆతనియానతి చొప్పున కుమారహంవీరవిభుఁడు దక్షిణదిక్కును జయించి శత్రురక్తసిక్తమయిన తన ఖడ్గమును దక్షిణసముద్రోదకములందు గడిగెను. 10 ఉత్కళదేశనాయకుఁడగు నాతఁడు [కపిలేశ్వరుఁడు] దిగంతసామంత కిరీటమాలికామణిద్యుతిద్యోతితపాదుఁడై కటకము రాజధానిగా రాజ్యమేలెను. 11 ఆతనికిఁ బురుషోత్తముఁడు కుమారుఁడు. ఆతనియెడ వసుంధర పతివ్రతాధర్మము నెఱపెను 12 ఆతఁడు మహాదాత 13 ఆతని ప్రతాపాగ్నిజ్వాలయో యనునట్లు కుసుంభవర్ణము గలది ధ్వజపటము కాఁగా, శత్రువులు చిదికిపోవుచుండువారు. కర్ణాటదేశాధిపుఁడయిన నరసింహరాజు అభయయాచనాంజలితో నుదయగిరి నర్పించుకొని తనప్రాణములఁ గాచుకొనెను. 14 ఆతనిధాటిని విన్నంతనే శత్రురాజు లడవులపాలగుచుండెడివారు. 15 ఆతనికి ప్రతాపరుద్రుఁడను కుమారుఁడు జన్మించెను. 16 అమాత్యులచే అభిషేకాదిసత్క్రియలఁ బడసి వృద్ధిపొంది యీతఁడు తండ్రికిఁ దర్వాత రాజ్యమేలెను. 17 ఆతఁడు యుద్ధమందు కాలరుద్రుఁడని, దానమందు కల్పవృక్షమని, సకలజనరంజనమందు చంద్రుఁడని, సౌందర్యమందు మన్మథుఁడని, విద్యలందు బ్రహ్మయని, తలఁపఁబడుచుండును 18 ఆతఁడు కర్ణాటాంగవిదర్భతురుష్కరాజులకు వెఱపు గొలుపువాఁడుగా నుండెను 19 ఆతఁడు సేనాసమేతుఁడై దక్షిణదిగ్యాత్రార్థము దాడివెడలి కృష్ణాతీరమును జేరి బ్రాహ్మణులకు భూదానము చేయనుద్దేశించెను. 20 1422అగు శకాబ్దమందు రౌద్రివత్సరమున కార్తికమాసమున (పూర్ణిమా) గురువారమునాఁడు చంద్రగ్రహణపుణ్యకాలమున శ్రీవీరరుద్రగజపతి కృష్ణానదీపశ్చిమతీరమున సస్యశ్రీయుతమై విరాజిల్లుచున్న యాతుమూడియను నగ్రహారతిలకమును బ్రాహ్మణులకు దానము చేసెను 21 సర్వవిద్యావిశారదులయిన బ్రాహ్మణులతో నున్న యాతుమూడి యగ్రహారము నూటయిరువదియెనిమిది భాగములుగా విభాగింపబడినది. 22 వృత్తిమంతుల గోత్రనామములు చెప్పబడినవి. ఉత్తరవీధి నారంభించి తూర్పువీధినుండి ప్రదక్షిణక్రమముగా జూడవలెను. తరువాత భాగస్వాముల గోత్రనామములు, భాగసంఖ్య, సీమాచిహ్నములు గలవు.

దత్తాగ్రహారము

ఆతుమూఁడి అనగా, తెనాలితాలుకాలోని అనంతవరమే. మెకంజీదొరగారి లోకల్ రికార్డువాల్యుంలో, ఆతుమూడి ప్రతి నామదేయమయిన అనంతవర మని వ్రాత కలదు. మఱియు నీశాసనమున జెప్పబడిన యెల్లలు నేడును నావ్యవహారములోనే కలవు. అవి తెనాలి తాలూకాలో కృష్ణాతీరమున విద్వద్బ్రాహ్మణ భరితమయిన గొప్పగ్రామముగా వెలయుచున్న 'అనంతరవము'నకే చెల్లుచున్నవి. మఱియు నీశాసనమునఁ బ్రతిగ్రహీతలుగా జెప్పబడినవారి వంశపరంపరల లోనివారనదగినవారు బ్రాహ్మణులు గొంద ఱాగ్రామమున నేడును వసించుచున్నారు.

చరిత్రవివరణము

కళింగదేశాధీశ్వరులగు గాంగవంశ్య నృపాలుర శాసనములు పెక్కులు దొరకియున్నవి. ఆరాజులకును నీశాసనమున బ్రస్తుతులగు రాజులకును నేమేని సంబంధము కలదో లేదో నాకెఱుగరాలేదు.* ఈవంశపురాజులలో దొలుత టిరాజుగా దెలియవచ్చినవా డీశాసనమున దొలుత బ్రస్తుతుడగు కపిలేశ్వరగజపతియే. కపిలేశ్వరుని వంశమున పూర్వు లెవరో వారెక్కడనుండిరో నాకెఱుగ రాలేదు. గజపతి గౌడేశ్వర నవకోటికర్ణాటకలుబరగేశ్వరులని సరస్వతీవిలాసమునను, గొన్నిశాసనములందును, వీరి బిరుదావళి గానవచ్చును. ఈబిరుదావళి కపిలేశ్వరగజపతి నాఁటికి గలదనుట కాధారము గానరాదు. కపిలేశ్వరుని నాటనుండియు వీరికి రాజధాని కటకము. నేడది 'కటక్' అని యుచ్చారము గలిగి జగన్నాథ క్షేత్రము చేరువ నున్నది. ప్రతాపరుద్రగజపతి రచితముగా బేర్వెలసియున్న సరస్వతీవిలాసమున వీరి వంశక్రమ మిట్లు గలదు.

కపిలేశ్వరగజపతి
| [భార్య పార్వతి]
పురుషోత్తమగజపతి
| [భార్య రూపాంబ]
ప్రతాపరుద్రగజపతి
| [భార్య పద్మాంబికమయిలాంబ
పురుషోత్తమగజపతి

శాసనములఁ బరిశోధింపగా నీవంశమున మఱికొందఱు పురుషు లెరుగ వచ్చుచున్నారు. గణదేవుని కొండవీటి తామ్రశాసనమున నిట్లు గలదు. 1

కపిలేశ్వర గజపతి [వంశమున]
|
చంద్ర దేవుఁడు
|
గుహిదేవ పాత్రుడు
|
గాణమహీపతి

ఈశాసనమున వర్ణితు లగువారు కపిలేశ్వర గజపతి సంతానక్రమమువారో, జ్ఞాతివంశమువారో యని నాసంశయము. ఇందు గడపటివాడగు గాణమహీపతి, కపిలేశ్వరగజపతికి బ్రతినిధిగా గొండవీట నుండెను. మఱియు జక్కంపూడి శాసనమున 2 ప్రతాపకపిలేశ్వరదేవ మహారాయలకు అంబదేవ మహారాజని కుమారుడున్నట్లు గానవచ్చును. ప్రతాపరుద్రగజపతికి దిరుమలప్ప రాయడని పినతండ్రి యొక్కడున్నట్లును, అతడు కృష్ణరాయలచే శా. ౧౪౩౭ భావ జ్యేష్ఠ బ ౨ నాడు పట్టుకొనబడినట్లును ఉదయగిరి శాసనమున గలదు. ప్రతాపరుద్రుని కాతడు సరిగా బినతండ్రియో పినతండ్రి వరుసవాడో యెఱుగరాదు. సరస్వతీ విలాస మాతని బేర్కొనకుండుటచే నాతడు స్వయా

* గంగవంశానుచరిత మను సంస్కృతచంపూగ్రంథమున నిట్లు గలదు "గౌడంగరాజు గజపతులను వెడలగొట్టి తత్సింహాసనమునఁ దాను గూర్చుండెను. తద్వంశక్రమము: రాజరాజేశ్వరుడు, అతిరథుడు, కామదేవుడు, మదనకామదేవుడు, అనంగభీముడు, నృసింహుడు, [లాంగులనృసింహుడని నామాంతరము] భీమనృసింహుడు, పురుషోత్తముడు, కలినృసింహదేవుడు, అవటానృసింహదేవుడు, ప్రతాపనృసింహదేవుడు, నిశ్శంకభానుడు, వాతూలభానుడు, వీరభానుడు, రుచిరభానుడు, మధుపభానుడు, కజ్జలభానుడు - ఈతడు దిగ్జయమున కరిగియుండగా, కటకరాజధానిలో మంత్రులు కపిలేశ్వరు నభిషేకించిరి. ఆతడు గుడారి [ఉదయగిరి?] కటకమున దాక్షిణాత్య రాజును దొలగద్రోలి అక్కడ రాజ్యము చేసెను—,, దీనిని బట్టి గంగవంశపురాజులకును కపిలేశ్వరాదులకును సంబంధ మెట్టిదో నిశ్చయింప గుదరదు. వారి కీవంశమువారు బంధువులేని, సేనాపతులేని, శత్రువులేని కాదగుదురు.

1 ఇది హుల్షుదొరగారిచే 1891 సం॥ ఇండియన్ ఆన్‌టిక్వరీలో ప్రకటితము.

2 ఈశాసన మముద్రితము. లోకలురికార్డు 15-5-87 సం॥ సంపుటము పేజి 205లో గలదు. "మవుంజెక్కంపూడి పరగణేమయిలవరం జక్కంపూడిగ్రామమునకు తూర్పున చెర్వు పడమరభూమిది శాసనం,, అనికలదు.

న పినతండ్రి కాదేమో యని నా సందేహము. మఱియు ప్రతాపరుద్రగజపతికి వీరభద్రగజపతి యని కొడుకున్నట్లు శాసనములు తెలుపుచున్నవి. సరస్వతీవిలాస మాతని పేర్కొనలేదు కాని ప్రతాపరుద్రగజపతికి పురుషోత్తము డనికొడుకున్నట్టందు గలదు 1 ప్రతాపరుద్రగజపతికి భద్ర యను నామె కుమార్తె గలదు.2 ఆ మెను ప్రతాపరుద్రగజపతి శ్రీకృష్ణదేవరాయలవారి కొసగెను. ప్రతాపరుద్రగజపతి కుమార్తె తర్వాత వంశవృత్తాంతము నాకెఱుక రాలేదు ఆంధ్రదేశమున వారి సంబంధ మప్పటితో దీరిపోయినది. ఇప్పుడు పరామర్శించిన విషయమున వీరి వంశవృక్షమిట్లేర్పడును:—




శక. ౧౦౫౬ గజపతివంశజుఁడగు గణపతి గోపరాజు రామప్రధానునకు భూదాన మొసఁగినట్లును, కాలభాస్కరదేవుఁడని రాజవ్వడున్నట్లును కొన్ని వ్రాఁతవ్రాఁతలున్నవి 3 సరస్వతీవిలాసమునుబట్టి, శాసనములను బట్టి మీఁదఁ జూపఁబడిన వంశముతో వారి కేమేని సంబంధము గలదోలేదో, అట్టివారు కలరోలేరో నేను నిర్ణయింపఁ జాలకున్నాను. వీరు గాక లాంగూలగజపతి, బాహుబలేంద్ర గజపతి, హరిశ్చంద్ర గజపతి, విద్యాధర గజపతి మొదలగు గజపతుల పేర్లు కొన్ని శాసనములందును, దండకవిలెలందును, లోకలురికార్డులు [illegible] ప్రాతవ్రాఁతలందును గానవచ్చుచున్నవి. వారిలో నేను గుర్తింపఁగల్గినవారి నాయా రాజుల ప్రసక్తిలోఁ దెల్పుదును.

### కపిలేశ్వరగజపతి

ఈతని రాజ్యారంభకాలమేదో నేను గుర్తింపఁజాలనయితిని. కటకము రాజధానిగా రాజ్యమేలుచు నీతఁడు క్రీ. 1455 కుఁ బూర్వమే కొండవీటిరాజ్యమును జయించి తనవంశమువాఁడగు గాణమహీపతి నక్కడఁ దన ప్రతినిధిగా నిల్పెను. ఈతనికి శ్రీవీరగజపతి గౌడేశ్వర ప్రతాపకపిలేశ్వరుఁడని జక్కంపూడిశాసనమున బిరుదు పేరున్నది. ప్రస్తుతశాసనమున నీతఁడు 'విద్యానగరము నరికట్టి విద్యానగరరాజు దగ్గఱనుండి పన్నుగొన్నాఁడని యున్న విషయము క్రొత్తది. ఈవిషయ మన్యత్ర నాకెక్కడను గానరాలేదు. "ఈతనియాజ్ఞచేఁ గుమారహంవీరవిభుఁడు దక్షిణదిగ్జైత్రయాత్ర సాగించి శత్రురక్తసిక్తమగు తన ఖడ్గమును దక్షిణసముద్రోదకములందు గడిగె,,నని ప్రస్తుతశాసనమునందే కలదుగాన విద్యానగర నిరోధాదిక మా కుమారహంవీరవిభుని జైత్రయాత్రలో జరగిన దయియుండును. కుమారహంవీరుఁ డనఁగాఁ [కపిలేశ్వరునికిఁ] గుమారుఁడగు హంవీరుఁడని రాఘవాచార్యులంగారు వ్రాసిరి. ఇది నిజమయిన విశ్వాస్యమో! శాసనములలోఁ గాని, సరస్వతీవిలాసమునఁ గాని స్పష్టముగా నీవిషయము గానరాదు. కృష్ణదేవరాయఁడు కొండవీటిని బట్టుకొన్నప్పుడు దుర్గము మీఁదఁ బ్రతాపరుద్రగజపతి కుమారుఁడగు వీరభద్రరాయఁడును, కుమారహంవీరపాత్రుని కుమారుఁడగు నరహరిదేవు మొదలగువా రుండిరని కలదు కపిలేశ్వర గజపతి

1. స్వయం పురుషోత్తమాపి పురుషోత్తమ తనయః స్వయం పురుషోత్తము తనయోపి పురుషోత్తమ జనకః స్వయం పురుషోత్తమ జాకోపి పురుషోత్తమసేవకః [సరస్వతీవిలాసము]

2 శ్లో. ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య పుత్రీం పవిత్రీకృత భూతధాత్రీం, ప్రత్యగ్రహీ న్యః ప్రకటప్రతాపో భద్రాం సుభద్రా మివపాండవేయః, [తిమ్మకవి ప్రబోధచంద్రోదయవ్యాఖ్య.]

8. ఈవని పొలాల్లో ఉండేశాసనము—అర్కసంఖ్యాక గోత్రాణాం విప్రాణాంచ మహాత్మనామ్। ద్విచత్వారింశ సంఖ్యానామూర్విం గణపతి ర్దదా।......శ్రీమాన్ శకాబ్దే రసబాణఖేందుసంఖ్యాప్రవృత్తే ద్విజ పుంగవేభ్యః । గ్రామాన్ దదౌ శ్రీగణపత్యభిఖ్యో వృత్తిప్రయుక్తాన్ గజపత్య ధీశః।......శరబాణాభ్రభూ సంఖ్యే ప్రవృత్తే శకవత్సరే। ప్రమాదీచాఖ్య వర్షేషు గజపత్యన్వయోద్భవః। అర్కసంఖ్యాక గోత్రాణాం విప్రాణాంచ మహాత్మనామ్ । కాలభాస్కరదేవో......ఇత్యాది—ఇట్లు లోకల్ రికార్డు వాల్యుములలోఁ గలదు. ఆంధ్రదేశ చరిత్రమున శ్రీ బుక్కపట్టణము రాఘవాచార్యులుగారును వ్రాసిరి.

క్రీ. 1455 కంటెను బూర్వమే కొండవీటిరాజ్యము నాక్రమించుకొన్నాఁడు గాన యానాటికి రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి కుటుంబము రాజ్యమేలుచునే యుండెను. వారితో మైత్రిగల్గి, వారితోడ్పాటును బడసియే కపిలేశ్వరుఁడు కొండవీటి నాక్రమించుకొని యుండును. వేమవీరభద్రారెడ్లు ఉత్కలరాజుతో మైత్రి గలవారని భీమఖండమునను, కాశీఖండమునను గలదు "ఉత్కలకర్ణాటకురుపక్రాట్పరమమిత్రా!, 'కర్ణాటోత్కల పారసీక నృపసఖ్యప్రాభవశ్రీనిధీ!''—కాశీఖండము. వేమవీరభద్రారెడ్లకుఁ గొండవీటి పెదకోమటి వేమారెడ్డి కుటుంబముతో విరోధము గాన వారు కొండవీటి విజయమున నుత్కలులకుఁ దోడ్పడియుందురు. ఇప్పుడు విశాఖపట్టణ మండలమునఁగల పార్వతీపుర మీకపిలేశ్వరుని భార్య పేరఁ గట్టఁబడినదనియు, కృష్ణామండలమునఁగల కపిలేశ్వరపుర మీతని పేరఁగట్టఁబడినదనియు, బాహుపరాక్రమశాలి యగుటచే బాహుబలేంద్రుఁ డనికూడ నీతనికి బిరుదుపేరనియు, నీయూరుదగ్గఱగల బాహుబలేంద్రునిగూడె మా బిరుదుపేర వెలయింపఁబడినదనియు శ్రీ రాఘవాచార్యులుగారు వ్రాసిరి. కాని బాహుబలేంద్ర గజపతి పురుషోత్తమ గజపతికి దర్వాతివాఁడని, అతఁడు కపిలేశ్వరగజపతికంటె భిన్నుఁడని యీక్రిందపద్యము చెప్పుచున్నది.

"వీరశ్రీ గజపతి పురుషోత్తమ గజపతి నిర్మితంబును ......అగు పురుషోత్తపట్టణంబున... ...

సీ. సాంద్రయశోధనుండు హరి
శౌర్యుఁడు బాహుబలేంద్రుఁ డాహరి
శ్చంద్ర మహీతలేశుఁడు భృ
శంబుగ సత్యవచో(?) నొసంగఁగాఁ
జంద్ర సుగంధపుష్పమున
సంకుమదాంబర రత్నరాజి ని
స్తంద్రశుభోక్తిఁ గైకొనియె
దాసరిగంగన లోకమెన్నఁగన్.''

మాఘమాహాత్మ్యము—ఒడ్డెపూఁడి పెద్దన.

ఈకపిలేశ్వర గజపతి క్రీ. 1460 లేక 1461 వఱకు రాజ్యమేలెను. ఈతని 38 వ విజయరాజ్యాంక వత్సరమున వెలయింపఁబడినదిగా నొకశిలాశాసనము దాక్షారామక్షేత్రమునఁ గలదు. శ్రీకాకుళమున నాతని 38 వ విజయరాజ్యాంక వత్సరమున నొక శాసనము కలదు. కాన యాతఁడు కొండవీటిని జయించిన పిదపఁ బదియేండ్లకు మించి రాజ్యమేలినట్లు తెలియును.

## పురుషోత్తమ గజపతి.

తండ్రివలె నీతఁడు విద్యానగర రాజ్యముమీఁదికి దండువెడలి యక్కడ రాజ్యమేలుచున్న సాళ్వగుండ నరసింహరాయలను బట్టుకొనఁగా నాతఁ డభయయాచనాంజలితో నుదయగిరిరాజ్యము నొసఁగి తన్ను విడిపించుకొనెనని ప్రస్తుతశాసనము చెప్పుచున్నది. కావున నీతని కాలమున నుత్కళరాజ్యము, కర్ణాటరాజ్యములోని భాగమగు నుదయగిరిసీమను గూడ నాక్రమించె ననియుఁ, గర్ణాటకులకు గుండెదిగులు గొల్పుచుండెననియుఁ దలఁపఁదగును. పురుషోత్తమగజపతి రెడ్డిరాజు లొసఁగిన యగ్రహారదానశాసనములు కొన్నింటిమీఁదఁ దన పునరంగీకారమును జెక్కించుకొన్నాఁడు. ప్రజలు ప్రార్థించఁగా నీతఁడు క్రీ. 1486లో పెండ్లి సుంకములను తీసివేసి నాఁటిదె కొండవీటి శాసనమున్నది. ఈతఁడు సంస్కృతమున విద్వాంసుఁడు. త్రికాండ శేషము, ఊష్మ భేదప్రకాశిక మొదలగు గ్రంథము లీతనివి గొన్ని గలవు. ఈతఁడెంతకాలము దాఁక రాజ్యమేలెనో నేను గుర్తింపఁజాలనయితిని. క్రీ. 1490 వఱకు నీతనిశాసనముల యునికిని గుర్తించితిని. బెజవాడ దగ్గరనున్న పురుషోత్తమపట్టణ మీతని పేరఁ గట్టఁబడినది. ప్రతాపరుద్రగజపతి కాలమున బాహుబలేంద్రగజపతి, విద్యాధరగజపతియు నాపట్టణమున నుండిరి

## ప్రతాపరుద్రగజపతి

ఈతఁడు 'దుర్గావరపుత్రుఁ'డని సరస్వతీవిలాసమునఁ బ్రశంసగలదు. పురుషోత్తమగజపతి బెజవాడ కనకదుర్గకు భక్తుఁడనియుఁ దదనుగ్రహమునఁ బ్రతాపరుద్రగజపతి జనించెనన్న నమ్మికచే నాతనికిఁ 'దుర్గావరపుత్రు'డన్న బిరుదు వెలసెననియుఁ దలఁపఁదగును. 1490 దాఁక పురుషోత్తమగజపతి శాసనములు గానవచ్చుచున్నవి గావున, జైత్రయాత్ర సెలవిప్పుడు చేసిన మన ప్రస్తుతశాసనము కాలము 1500‡ కావునను నీతడు 1495 ప్రాంతముల

‡ ఈ సమయముననే బాపట్లతాలూకాలోని దగు ఈడ్పులపాడు గ్రామమునుగూడ యాజ్ఞవల్క్య బ్రాహ్మణుల కీతఁడు దానముచేసెను. "శాకాబ్దే కరనేత్రవార్ధిశశభృత్సంఖ్యేచ రౌద్రి శర, ద్యూర్జేమాసి విధూపరాగసు

రాజ్యమునకు వచ్చియుండునని తలఁపదగును. పురుషోత్తమ గజపతికాలమునను, నీతని కాలమునను నోఢ్రదేశమున గొప్ప మతపరివర్తకుఁ డొక మహనీయుఁడు వెలసెను. ఆయన గౌరాంగదేవుఁడు. చైతన్యమత మామహాత్మునిచే బ్రవర్తితమైనది. ఆయన విద్యానగరమునకుఁగూడ విచ్చేసినట్లు గాధలు గలవు. ఈగజపతుల యభ్యర్థనముచే విద్యానగర దండయాత్రకాలమున నాయనవచ్చెను వచ్చియుండవచ్చును. ప్రతాపరుద్రగజపతికి వైదికాచారముమీఁదను, సంస్కృతభాషమీఁదను నాదరము హెచ్చు. సంస్కృతభాషలో సరస్వతీవిలాసమను యొక గొప్ప ధర్మశాస్త్ర నిబంధన గ్రంథము తత్కృతముగా వెలయుచున్నది. అందు ప్రతాపరుద్రగజపతినిగూర్చి యీక్రిందివిషయము తెలియఁగవచ్చుచున్నవి. "వీరరుద్రోఽపి పద్మాళిప్తతనుః కటకనగరీం పద్మాపద్మాలయేలా మహీలాభిన్నమం సమ్మానయన్-,, అనువాక్యములచే వీరరుద్రగజపతికిఁ బద్మయని యొకర్తె భార్య గలదని స్పష్టముగా తెలియఁగ నగును. రాఘవాచార్యులుగారు మహీలాపదమును బట్టి యామె పేరు మైలమాంబ యని తలఁచిరి. మైలమాంబకూడ వేఱొకతె యుండిన నుండవచ్చును—"స్వయం విద్యాధర సద్వృత్త్యోఽసి కింకరీకృత విద్యాధరః,, అని యందుఁ గలదు. దీనిచే విద్యాధరుని పేరనే బెజవాడపద్దర విద్యాధరపురమని గ్రామము వెలసినది. మఱియు సరస్వతీవిలాసమున వీరరుద్రుడు గౌడేంద్రమానమర్దనుఁడనియు, జమునాపురాధీశ్వరుడగు హుసేనసాహి యను తురుష్కుఁడు శరణాగతుఁడు కాఁగా శత్రులనుండి వాని రక్షించెననియు గలదు. కొండపల్లి దగ్గఱ నీతడు గాలబురాక అనే తురక సర్దారును జయించినట్లు కొండపల్లి దండకవిలెలోఁ గలదని రాఘవాచార్యులుగారు వ్రాసిరి. కొండపల్లి దండకవిలె యెక్కడ గలదో నేఁజూడలేదు. మఱియు రాఘవాచార్యులుగారు "ప్రతాపరుద్రగజపతికే విద్యాధరగజపతియని పేరు. ఈయన పేర కొండపల్లిలో దుర్గంక్రింద విద్యాధరగజపతి చెఱువు అని చెఱువు ఉన్నది. ఆచెర్వులో యీతడు లక్కబుడవమీఁద షికారు చేసేవాడట,, అని వ్రాసిరి. విద్యాధరగజపతి ప్రతాపరుద్రగజపతిక్రింద యుద్యోగియని సరస్వతీ విలాసమునఁ గలదుగదా! ఈతనికి "వీరశ్రీ గజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాట కలుబరిగేశ్వర శ్రీదుర్గావరపుత్ర రాజాధిరాజ రాజపరమేశ్వ,,రేతి బిరుదావళి గలదు.

సరస్వతీవిలాసము ప్రతాపరుద్రగజపతి కృతమని గద్యమునను, అవతరణికలోను గలదుగాని యది విశ్వసనీయము గాదు. అందొక్క యుల్లాస మెల్ల గ్రంథకర్తృవంశప్రశస్తియని కలదు. ఆప్రశస్తియుఁ, గాదంబరీగద్యములం బోలు గద్యములతో, హృద్యపద్యములతో నద్భుతకావ్యమాగా నున్నది. గ్రంథకర్తయే తన్నుఁ దానిట్లు ప్రస్తుతించుకొనవచ్చునా యని యాక్షేపమును, దానికేదో యప్రౌఢ సమాధానమునుగూడ నందుఁగలదు. ఎన్నియున్ననేమి? అది వీరరుద్రగజపతి స్వయంకృతము గాదని స్పష్టముగా తెలియగనగుచున్నది. వీరరుద్రగజపతియాస్థానమున లొల్లలక్ష్మీధరుఁడను గొప్ప విద్వాంసుఁ డుండెను. ఆగ్రంథ మాతఁడు రచించినది అట్లనుటకు గారణము లివి;—లొల్లలక్ష్మీధరుఁడు బహుగ్రంథకర్త. ఆవిద్వాంసుని సౌందర్యలహరీవ్యాఖ్యానారంభశ్లోకములే సరస్వతీవిలాసారంభమునను గలవు. గ్రంథకర్త ప్రతాపరుద్రగజపతియే యగునేని మహాకావ్య మనఁదగినట్లు స్వవంశప్రశస్తియనుగు ప్రత్యేకోల్లాసమును, ప్రశస్తవాక్యరచనతో గ్రంథమెల్లను రచింపనేర్చినవాఁడు గ్రంథారంభశ్లోకములను అన్యానకవికృతమగు గ్రంథాంతరమునుండి కైకొనఁగోరఁడు. వేఱుగా శ్లోకములు వెలయించి చేర్పఁగలవాఁడె యగును. లక్ష్మీధరపండితుఁడు సరస్వతీవిలాసము తనకృతియని భావిలోకము గుర్తించుట కిదియొకసాధనమై యుండుఁగాక యనుతలంపుతోఁ గాఁబోలు, సౌందర్యలహరీ వ్యాఖ్యా పీఠికశ్లోకములనే యిందుఁ జేర్చినాఁడు మఱియు నాపండితుఁడు రాజాజ్ఞచేఁ దనపరిశ్రమము నాతఁడు రాజార్పితముఁ జేసినను భావికాలమునఁగూడ వాస్తవము ప్రవ్యక్తమగును గాక యనుకోరికతోఁ గాఁబోలును, తన సౌందర్యలహరీ గద్యమందు సరస్వతీవిలాసమను పేరుగల స్మృతి నిబంధనమును దాను రచించినట్లు చెప్పుకొన్నాఁడు.

సౌందర్యలహరీ వ్యాఖ్యాంత గద్యము.

"......నిఖిలయామళతంత్రావగాహన రుద్రేణ

---

మయే శ్రీవీరరుద్రేభరాట్, భారద్వాజసగోత్రమాధవ బుధాయా [ ]శాఖాజూషే, పాద్రాదిట్పులపాటినామక మహాగ్రామం నృపగ్రామణీః సః. శ్రీయాజ్ఞవల్క్య ప్రసిద్ధాన్వయమునందు ముఖ్యుండు దామయ్య ముత్తాత-ఇత్యాది- సంస్కృతాంధ్రపద్యమయ శాసనము-గవర్నమెంటువారి 1922 సం॥ శాసనసంచయమున 802 నెం॥ గలదు. ఇది యప్రకటితము.

అశ్రీయాకృత గజపతివీర రుద్రేణ నీలగిరి సుందరచరణార వింద చంచరీకేణ వాణీసహచరీకేణ, సరస్వతీవిలాసాద్యనేకస్మృతినిబంధన, లక్ష్మీధరాద్యనేక సాహిత్యనిబంధన, నయవివేకాద్యనేక గురుమత నిబంధన, యోగదీపికాద్యనేక పాతంజల మతనిబంధన, మహానిబంధనాఖ్య మానవ ధర్మశాస్త్రటీకా, కర్ణవతంస బ్రహ్మామృతం సాద్యనేక కావ్యకల్పకేన ఆశ్రితజనకల్పకేన నిగ్రహానుగ్రహకౌశలేన శ్రీమహోపాధ్యాయ లక్ష్మీధర దేశికేన—,,

ఈలక్ష్మీధర పండితుని వంశమువారిప్పటికిని కృష్ణాతీరమున ప్రస్తుతశాసనమున దత్తాగ్రహారమగు ననంతవరమనఁ గడుఁజేసువనే కొల్లూరను గ్రామమున లక్ష్మీధర పండితుఁ డార్జించిన విపులసంపదల ననుభవించుచు నెలయుచున్నారు.

ఈ లక్ష్మీధరపండితుఁడు గాక, ప్రతాపరుద్రగజపతి యాస్థానమున దివాకరుఁడను కవీశ్వరుఁడుగూడ నుండెను ఆతఁడు రచించిన మహాకావ్యము 'భారతామృతము' చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకశాలలోఁ గలదు. ప్రతాపరుద్ర గజపతి యాతనికిఁ దనయాస్థానమున 'కవిచంద్రరాయ' పదము నిచ్చెనట. ఆతని భారతామృతము ప్రౌఢము, రసవంతము నగు మహాకావ్యము. ఆతనిచరిత్ర మిట్టుల—

"యం ప్రాసూత పతివ్రతాగుణవతీ—శ్రీపైద్యేశ్వరతో విభూషితభరద్వాజాన్వయా దాత్మజమ్, కావ్యేతస్య దివాకరస్య కృతినో బాలాధరస్యాదుని, ఖ్యాతే భవ్యపదోఽయ మాసి గదిత స్సర్గ స్సమాప్తోఽభవత్ కావ్యే తస్య పితృవ్యతః కవిసృపా త్స్వాత్య శిక్షా భృతః యాచ్ఛ్రితా మధుసూదనో మధురయా కంనామ నానందయత్, భాతోఽభ్యణ్యతి యేన ఘూర్తచరితం చేతశ్చమత్కారకృత్, యోదేవ్యా స్తుతి మద్రరాజదుహితు శ్లోకై శ్శతే నాకరోత్, జాతో వ జన నేయి నామపి కులేయోఽనేకవిద్యావతాం, రమ్యం చాకృత పారిజాతహరణం సన్నాటకం యశ్చాభత్ కవిచంద్రరాయ పదవీం రుద్రభూమిభుజః యత్పి త్రాకవిడిండిమోఽనేకవితావాజితః యశ్చక్రే రసమంజరీతి రసికాహ్లాదాయపద్యావళిం, కావ్యే తస్య సహోదరా దభినవ శ్రీగోవిందతః,

ఈతని చరిత్రము తెల్గుదేశపు సంస్కృతకవుల చరిత్రలో విస్తరించి వ్రాసితిని

లొల్లలక్ష్మీధర పండితుడును, నీదివాకర కవియు 1519 లో ప్రతాపరుద్రగజపతి ఆంధ్రరాజ్యమును బూర్తిగాఁ గోల్పోయిన పిదప, శ్రీకృష్ణదేవరాయలవారి యాస్థానకవులై పేర్వెలసిరి. దివాకరకవి 'కర్ణాటాధిప కృష్ణరాయనదసి ఖ్యాతస్య విద్వత్తయా, అని చెప్పుకొన్నాఁడు. లొల్లలక్ష్మీధరపండితుఁడుగూడఁ గృష్ణరాయలవారి సమ్మానమునఁ గొన్ని కృతులఁ గూర్చెను. వానిలో దైవజ్ఞ విలాసము ప్రధానమయినది.

ఈసమస్య శ్రీకృష్ణరాయల పేర లక్ష్మీధర పండితుఁడు పూరించినది.

శ్లో. శ్రీకృష్ణక్షితిపాల దత్తమణిభిర్విద్వత్కవీనాం గృహే, నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వంగతాః, అబ్ధిః కేవలవారిపూరనిలయః సంభావ్యతే సజ్జనై, రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాంనిధి ర్వారిధిః.

ప్రస్తుత శాసనము ప్రతాపరుద్రగజపతి క్రీ. 150? లో దక్షిణదిగ్జయార్థము బయలువెడలి కృష్ణాతీరమున బ్రాహ్మణుల కగ్రహారదానము చేసిన సందర్భమందలిది గదా! ఇది జరసిన పిదప గజపతి జైత్రయాత్ర సాగించెనో లేదో, దక్షిణదేశ మేమి జయించెనో యెఱుఁగరాదు. క్రీ. 1513 సంవత్సరముదాఁక నీతడు క్రొత్త దేశమును జయింపకున్నను, పూర్వ ముండిన దేశమును గోల్పోలేదని నమ్మవచ్చును. కొండవీటిలోఁ గుమారుడగు వీరభద్రగజపతిని, ఉదయగిరిలోఁ బినతండ్రియగు తిరుమల రౌతరాయ మహాపాత్రుని నెలకొల్పి యేల్బడిని బలిష్ఠముగాఁ జేసినాఁడు. ఈతనికి నమ్మకముగల భృత్యులై యాంధ్రదేశమున నొక క్షత్రియకుటుంబమువారు మిక్కిలి సహాయపడుచుండిరి. వారివంశవృక్ష మిట్టిది.



రాఘవాచార్యులుగారు, కపిలేశ్వరగజపతి పరంపర వారును, వీరును ఒక్కవంశమువారే యని తలంచిరి. ఈతలఁపు సదాధారము గలదిగా నాకుఁ దోఁపదు. వీరిచేఁ జూపఁబడిన వంశవృక్షమునఁగల తిర్మలరాయఁడే [క్రీ. 1524] ప్రతాపరుద్రగజపతి పిన్నతండ్రియు, నుదయగిరి దుర్గమునందున్నవాఁడు నని వర్ణితుఁడయిన తిరుమల రౌత మహారాయఁడని వారు వ్రాసిరి. ఆతఁడు, నీతఁడు భిన్నులని నాతలఁపు. శ్రీకృష్ణరాయలు క్రీ. 1514 లో ఉదయగిరిని బట్టుకొని, అక్కడనుండి వీరరుద్రగజపతిని వెనుకకుఁ ద్రోలెను. 1515 లో కొండవీటిని జయించెను. 1516 తిరిగి కళింగదేశ విజయార్థము దండయాత్ర వెడలి, 1519 లో పొట్నూరిలోఁ బ్రతాపరుద్ర గజపతి నోడించి విజయస్తంభము వేయించి, యాతని కుమార్తెయగు భద్రను బెండ్లాడి, యాంధ్రదేశమున గజపతిరాజ్యము నంతరింపఁజేసెను. కాని కృష్ణరాయల తర్వాత ప్రతాపరుద్రగజపతి కుమారుఁడు గాఁబోలును, మరల కన్నడము మీఁదికి దండెత్తి రాఁగానో రాఁబోవఁగానో, పెద్దనామాత్యుఁ డీక్రింది పద్యము చెప్పి యాతని సిగ్గిలఁ జేసెనట!

సీ. రాయరాహుత మిండ రాచయేనుఁగు వచ్చి
యారట్లకోటఁ గోరాడునాఁడు
సంపెట నరపాల సార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు
సెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పులఁ గరుల డీకొల్పునాఁడు
ఘనతరనిర్ఝర గండపెండెర మిచ్చి
కూఁతు రాయల కొనఁ గూర్చునాఁడు
ఒడ లెఱుంగవొ చచ్చితో యుర్వి లేవొ
చేరఁ జాలక తల చెడి జీర్ణమైతొ
కన్నడం బెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెలిచినిలు కుక్క సొచ్చిన తెలుఁగు దోఁప.

ఈ గజపతుల పరిపాలనకాలమున నాంధ్రదేశమున స్మార్త ధర్మములును, సంస్కృతవిద్యయును నభ్యుదయము నందెను. గజపతులు స్వయము తెలుఁగు గ్రంథములను వేనిని గృతు లందరయిరి. కాని వీరి మంత్రులగు తెలుఁగువారు కొన్ని కృతులందిరి. వీరి పాలనకాలముననే శ్రీనాథ కవిసార్వభౌముఁడు దారిద్ర్యదగ్ధుఁడై కడగండ్లు గుడిచి, యుసురు విడిచెను.

‘వీరు స్వతంత్రాధికారము గల రాజు లయినందుకు దృష్టాంతముగా వీరి శాసనములు వేలుగా నుండెను. గజపతివారి శాసనములమీఁద వావుదాతో ఏనుగు స్వరూపము చేయబడియుండెను కొన్నిటిమీఁద సూర్యచంద్రులు సహితం ఉండును’’ అని రాఘవాచార్యులుగారు వ్రాసిరి.

రాఘవాచార్యులుగారీశాసనము నెఱుఁగుదురు. వారిచరిత్రలో దీనిని బ్రస్తావించిరి. వారియింటఁ జెడఁగొట్టబడిన శాసనములలో నిదియుఁ జేరియుండునేమో! ఈశాసన వివరణమున రాఘవాచార్యులుగారి గ్రంథము నాకుఁ గొంత యుపకరించినది.

ఆతుమూడి ప్రతినామధేయమయిన

## అనంతవరము తామ్రశాసనము

శ్లో. లక్ష్మీం నశ్చిరమాతనోతు భగవాన్ లీలావరాహో హరి
ర్మగ్నాముద్ధరితః పయోధిసలిలే విశ్వంభరాం దంష్ట్రయా
లగ్నాయప్యతనూరుహేషు సరితో భ్రాంతిస్పృశస్త్వార్ణవా
భుం కాంతాపరిరంగసౌఖ్యజనితస్వేదాంబులేశా ఇవ. ౧

,, హేరంబః శ్రియమాతనోతు జగతాం గండస్థలీసంచర
ద్భృంగీమంగళగానకర్ణనసుఖవ్యాసక్తచిత్తాంబుజః
యశ్శ్వేందాద్రిమునుష్యతిస్వహస్తైః ప్రక్రీడతశ్శైశవే
క్రీడాకందుకతాం భజంతి విపులాశ్చిత్రం కులక్ష్మాభృతః.

,, అస్మాకమచలాంశ్రియం వితనుతాం సింహాద్రిచూడా
మణిః, స్నేహాద్యస్యకరాంబుజద్వయగతౌ శ్రీశంఖచ
క్రౌ చిరం, సూర్యాచంద్రమసౌ స్వలోచనపదం సంప్రాప్య
యోగ్యాయుసౌ, స్ఫూర్యజ్జ్యోర్గత తేజసావిలసతో బింబావి
వ త్వాయతౌ. 3

,, పతిస్స్వామస్మి సగోజనీపతిస్త్రయీ మహాత్మాతను
సాంనిషూదనః, ప్రకాశసంవీతదిగంబరాంబరాః శివస్య
మూర్ధా సముదాహరంతి యమ్. ౪

,, తదీయవంశేతదనుప్రతాపవాం శ్చిరస్యరాజా కపిలేశ్వ
రాహ్వయః, అభూదభూతో పమపౌరుషోర్జితో జితోభ
యారాతిః శోభనోన్నతః. ౫

,, యమగ్రిగణ్యాంకిలపుణ్యవర్తినాం నృపేషు సింహాసనవర్తి
షు త్రిషు, అజస్రదానాంబుఝరక్షతత్క్షరం వదంతి
లోకా భువి దంతినాంపతిమ్. ౬

,, ఘనేనయేన ద్విజసంఘసాత్కృతా మహాగ్రహారాస్సు
ఉపకర్త్రిజ్వాలాః, మహీపురంధ్రిహృదయావలంబినో
మహాగ్రహారా ఇవ సంచకాసతే. ౭

„ ప్రసవ్యాకర్ణాటమహీపతేః పురీంనిరుధ్య విద్యానగరీం నిజైర్బలైస్సమున్నతం మానమివోచ్ఛ్రయం కరం సమాదదే కర్కశచక్రవిక్రమః. ౮

„ కుమారహంవీరవిభు ర్యదాజ్ఞయా విజిత్య కావేరీతటాంతదిశం ప్రతాపవాన్, అశోధయచ్ఛాత్రవశోణితోక్షితాం కృపాణికాం దక్షిణసాగరాంబుషు. ౯

„ సరాజధానీం కటకాభిధామసౌ దకంటకా ముత్కళ దేశనాయకః దిగంతసామంత కిరీటమాలికా మణిద్యుతి ద్యోతితపాదపంకజః ౧౦

„ సుతోభవత్తస్య సురేంద్రతేజసః పురందరశ్రీః పురుషోత్తమోనృపః వసుంధరాయత్రవసూపమే దధౌమహీధరస్థేమ్ని పతివ్రతావిధిమ్. ౧౧

„ యద్దానేన వినిర్జితా సురగవీ ఖాద త్యజస్రంతృణం చిత్తేసంతతచింతయా సురమణి శ్చింతామణిత్వంగతః, మేరౌసంభృతవల్కల స్సురనగోఘోరంతపస్తప్యతే మాలిన్యం జలదో బిభర్తి గగనా కాశాపరేషామహో. ౧౨

„ యస్మిన్ నిత్యతరప్రతాపదహన జ్వాలాయమానధ్వజస్తంభాబద్ధ కుసుంభరక్తవసన ప్రేంఖావిభగ్న ద్విషే, సంధాయాభయయాచనాంజలి మహోదత్వోదయాద్రింభయా, దాత్మానం మముచే నృసింహ నృపతిః కర్ణాటదేశాధిపః. ౧౩

శ్లో. యద్ధాటీచల ఘోటికాఖురపుటక్షుణ్ణక్షమా మండల ప్రోద్భూతాధ్వవిసృత్వరాధిక రజస్తోమం సమీక్ష్య ద్విషః, ధావంతే సపదిజ్వలిష్య దలఘుప్రోద్య ప్రతాపానల, ప్రోద్గచ్ఛద్ఘనధూమమండలధియా భీతా వనాభ్యంతరమ్. ౧౪

„ జాతస్తస్య సుతః ప్రతాపపదవాన్ రుద్రప్రశస్తినిధిః ఖ్యాతానంత గుణాన్వితాచల మహాధర్మాగ్రహాప్రోత్సుకః, విధ్వస్తాలఘుమర్జయారినగరః ప్రాప్తాచ్యుతోగ్రజ్వలద్భాతిరికీర్తి కోధృతశివశ్రీరాజచూడామణిః ౧౫

„ అమాత్య (...) తాభిషేక ముఖ్యసత్క్రియా పరిష్కృతామలప్రభాధిభాసు భానురాంగ సౌష్ఠవః, అనంతరం పితుర్మహీ ముశాదశాత్ర వామతుం ప్రతాపసింధదీధితిః ప్రతాపరుద్ర పార్థివః. ౧౬

„ యుద్ధే కృద్ధంవిపక్షక్షితిపతినివహో మన్యతే కాలరుద్రం కల్పక్షోణీరుహంయం కవిబుధనికరో దానశౌండ ప్రభావమ్ లోకాగపీయూషభానుం సకలజనమనోరంజనోదారవేషం, కాంతా స్సాక్షాద్రతీశం కమలభవమపి ప్రౌఢవిద్యాయుతంవా. ౧౭

„ అథత్రైభువితస్య రుద్రనృపతే ర్ధాటీదిగంతద్రవ, ద్ఘోటీశైల గుహాంతరస్థిత రిపుత్రస్తా భృష్టధూటీగణమ్, కర్ణాటం విపినాట మంగనృపతిం తుంగాద్రి శృంగాలయం, వైదర్భం నవవర్భగర్భ మరసం కుప్యం తురుష్కాంరణే. ౧౮

, వేదండప్రజగండ మండల గళద్దానాంబుధారాప్లుతో, త్పాదన్యక్కృతదైన్య సైన్యనివహాత్క్షుణ్ణక్షమామండలాత్, యాత్రాంపక్షిణదిగ్జయాయ విదధత్సంప్రాప్యకృష్ణాతటీం, సోయం రుద్రనృప స్స్వమైత్య దసఘోదాతుం ద్విజేభ్యో మహీమ్. ౧౯

„ శాకాబ్దేవ్వయ సేత్రవేపశశభృత్సంఖ్యాకరౌద్ర్యాహ్వయే, కార్తిక్యాం గురువాసరే గజపతి శ్రీవీర రుద్రాధిపః, సన్యశ్రీయుత మాతుమూడివిదితం చంద్రోపరాగేముదా, విప్రేభ్యోదిశ దగ్రహారతిలకం కృష్ణాతటీ పశ్చిమే. ౨౦

ఆదినా [?] మాతుమూ శిప్రవిదితధరణీ దేవరమ్యాగ్రహారే, వేదైర్విప్రై ష్షడంగశ్రుతిపఠన సరోజాననప్రౌఢవాగ్భిః, కీర్ణేవాక్యప్రమాణ స్ఫుటపద పదవీవాకృతిఖ్యాతవృత్తేః భాగానా మష్టవింశత్యధికశతమితాక్లుప్తసంఖ్యావిభాతి. ౨౧

వృత్తి మన్గోత్రనామాని లిఖ్యంతేదక్షిణాదికం, ఉత్తరశ్రేణిమారభ్య ప్రాచీపర్యా ప్రదక్షిణమ్. ౨౨

[తన్మాత దానము పొందిన బ్రాహ్మణుల ఇంటి పేర్లు, పేర్లు, గోత్రములున్ను, దానము చేయబడిన గ్రామము యొక్క సరిహద్దులున్ను ఇవ్వబడినవి.]

(ఆంధ్రపత్రిక విభవసంవత్సరాది సంచికనుండి.)

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు ముద్రితము రాజమండ్రి.

# అకారాదిసూచిక

:o: